# ఉపోద్ఘాతము

ఈ చిన్నిపొత్తము, తమపిల్లలకు ప్రాపంచిక విషయములు, ఇష్టాగోష్ఠి, ఆటగోలితనము నన నేమియో తెలియనీయక, శీఘ్రముగనె శుద్ధమోక్ష మిప్పింపవలె నని, సర్వకాల సర్వావస్థల యందును నాముష్మిక విషయములలోనె ముంచి లేవనెత్తువారికిని గాదు; తాము ప్రాపంచికు లయి పై నుదాహరింపబడిన మూడుమార్గముల నె కాలయాపనము చేయుచున్నను, పొరుగింటి పుల్లగూర యన చెవిగోసికొనుచు, పరదేశ భాష, వేషము, ఆహారము, ఆచారము, వ్యాయామము, క్రీడ యన, సర్వోత్కృష్టములుగ నెంచి, పరుగెత్తుటకో, బిలియర్డ్సునకో, బేడ్మింటనుకో, పింగు పాంగుకో, పందెల కొలది వ్యయముచేయుచు, విశ్వమునుంచి, స్వజాతీయము లన నేవగించుచు, "ఎవడురా కొండమీద సూర్యచంద్రులను వెలిగించినవాడు" అనుస్థితిలో నున్నవారికిని గాదు. మరి యేదికన, 'బాలస్తావత్క్రీడాసక్తః' 'వ్యాయామో వ్యాధినాశాయ' 'యుక్తాహారవిహారః' ఇత్యాది వ్యాయామములయందు విశ్వాసము గల్గి, బాలురకును, ఆరోగ్యము గోరు నెల్లరకును, రోగికైనను క్రీడావ్యాయామవిహారములు, అత్యా

వశ్యకము లని నమ్మి, అవి వృథాకాలక్షేపహేతువులు గావనియు, వానిచే ముందు చెప్పబోవు పెక్కులాభములు గల్గియుండుటయే గాక, ధర్మమునకు కార్యసాధన మగు శరీరమును యోగ్యమగుస్థితిలో నుంచుటకును, ఉపాదేయములగు కొన్ని మనోధర్మములను అభివృద్ధిలోనికి తెచ్చుటకును, క్రీడావ్యాయామములుగూడ, పాఠశాలలో జేయు విద్యాభ్యాసమువలెనె స్వాభావికమార్గములే యని యాదరముతో నాచరించువా రెవరో వారికే.

సంస్కృత గ్రంథజాలమున నానా విషయముల గురించి పెక్కు పుస్తకములును, క్రీడావ్యాయామములను గురించి యట్టి పుస్తకములలో యాదృచ్ఛికముగ వచన కొన్నివ్యాసములును, తరుచు గనుచునే యుందుముగాని, ప్రత్యేకము క్రీడావ్యాయామములను గురించి గ్రంథమొక్కటియైనను గానరాదు. అట్టిదెప్పుడైన నెచటనైన నుండెనేమో గాని, ప్రస్తుతమున వాడుకలో లేమిచే నుత్సన్నమై యుండనోపునని యూహింపవలసి యున్నది. మన పూర్వులు సర్వశాస్త్రములను సర్వకళలను సాధ్యమైనంతవరకు ప్రయోజనైక్యమును గల్పించి, పురుషార్థ సాధనములుగనే యేర్పాటుచేసి యుండుటచే శరీరసాధనములలో కొంతపట్టుకు యోగశాస్త్రమున నుపనిబద్ధములగు ఆసనములు ప్రాణాయామములు మొదలగువాని రూపమున గన్పట్టుచున్నవి. ఇందుకు భిన్న

ములగు వ్యాయామములును కొన్ని ప్రచారములో నున్న వృత్తికిని, వాని నేకముఖముచేసి గ్రంథరూపము నొందించిన వారు కనఁబడరు. ఇందుకు ముఖ్యముగు హేతువు మనవారి కిఁగల నిరసనభావమె. ఇట్టి నిరసనభావముగల మన యిప్పటి పెద్దలు, పాశ్చాత్య నాగరికత ఇంక విజృంభింపని పల్లెటి దిక్కులలో నయితము, పిల్లకాయ లాటలాడుచున్నచో చివాట్లు వేసి, ఇంటిలోనికో బడిలోనికో తరిమి, తాముమాత్రము, చీట్లపేకాటను, పూటలు దినములు కూడ తెగక నిష్ఫలముగ గడపుచుండుట కన్నులారఁ గనుచునేయున్నాము. అందును నియుల వారు సెంతకౌలుకులగు చాలమంది వ్యవసాయకులలో మిక్కుటముగ వ్యాపించుచున్న యీనూకు మొంతయు పోచని యును. అయినను ఇప్పటికిని అక్కడక్కడ, కొన్నికులముల వారిలోను ముఖ్యముగ నిమ్నజాతులలో, పల్లెలయందు, పిల్లల చిక్కి, నపుసు, బలు చెడుగుడియో, ఉప్పుబరియో, మఱియొక వ్యాయామమునో జరుపుచుండువారు లేకపోలేదు.

ఇక మన నవనాగరిక శిఖామణుల యవస్థ గందము. వారికి బుద్ధులు మెండు: అందుచే—మనకన్యము—కృత్యాకృత్య విచారణము మెండు. ఈ మాత్రమునకె ఆగ్రహపడి ప్రయోజనము లేదు. ఇందుకు దృష్టాంతములు వేనవేలు. దీర్ఘవిద్యాభ్యాసమువల్లను, వంశానుపూర్విగా వచ్చిన బుద్ధిసౌష్ఠవముచేతను, తాము పట్టినపనిని, విజాతీయము నయినను,

కనుకనె అధర్మము నైనను, మిక్కిలి నేర్పుతో సమర్థించు కొనగలరు. అట్టి ప్రయత్నమున మనకు దేశీయములగు క్రీడలె లేవు, వ్యాయామములె లేవు, విజ్ఞానమె లేదు, జాతియె లేదు అని నిశ్శంకముగాను నిర్లజ్జముగాను, ప్రయోజనాంతరాసక్తు లయి నుడువు పరులపలుకులను చిలుకలవలె పలుకు సాహసి కులను పెక్కండ్ర గనియున్నాను. వీరి సాహసమును, వీరి యనాదరమును, వీరి పట్టుదలయు నైజములయినచో జడియ వలసినంతగా నిపుడు జడియ నవసరము లేదు. ఏలయన వీరు చాలమట్టుకు పరులననుకరించుచు, వారేది ప్రోద్బలముచేసి చెప్పుదురో దానికె 'భళాభళి' యను వినయులుగాని వేరు కాదు. అయినను విదేశీయచోదితు లయి, ప్రప్రథమమున విదేశీయక్రీడావ్యాయామముల నిట నాటిన కొందరు స్వదేశీ యులే, స్వతంత్రించి వాటిని ధర్మమునువలె, స్వపుత్రాదుల కును, స్వమిత్రాదులకును, స్వశిష్యాదులకును శ్రద్ధతో గర పుచున్నారు. ఇందుచే క్రమక్రమముగా దేశీయములగు క్రీడా వ్యాయామములడుగంటి, ఉత్తమజాతులలోనివారట్టివియున్న వనుమాటయె మరచి, పరదేశీయముల నన్నిటిని పాదు కొల్పుట సంభవించినది. ఈయపనీతులగు దేశీయులను చల్లని సమయమున, ఏమి యాకర్మము? మనకు మాత్రము క్రీడలు లేవా వ్యాయామములు లేవా? వాటినేల యాదరింపరాదు? వాటిని నీటగల్పి పరదేశీయముల నిప్పట్ల గూడ ననుష్ఠించిన

గాని మనకు ముక్తిదొరకదా? యని యడిగినచో, వెంటనె వారు రెండుమూడుప్రశ్నల వేయుదురు.

అవియేవన (౧) ఐరోపియనుల కున్నట్లు మనకు క్రీడా వ్యాయామములనలెక్కడనున్నవి? (౨) మనవేమిటి ఇతరుల వేమిటి; క్రీడావ్యాయామములందు నాసక్తులగుటకు హేతువులు సమానములె. శరీరమునకు చెమ్మట పట్టి తిన్న యన్నము జీర్ణమును మనస్సునకు వినోదము కల్గుట ముఖ్యప్రయోజనము. అప్పుడవివకు యేల? (3) అథవా మనకును ఏవియైన నాట్లున్నను నవి [Crude and unscientific] అసంస్కృతములును, నవైజ్ఞానికములును, ననార్యజనోచితములును నైయున్నవి అని. ఇక పూర్వాచారపరాయణులందని విషయమును గురించి ముచ్చటించినచో మనకు లేవనిగాని, రెండునొక్కటియె ననిగాని, మనవి తక్కువవనిగాని యనరు. ఏలయన వీటినిగురించి బహుశః ఎప్పుడును విచారించియెయుండకపోవుటచేతను, చూచుచున్న పాశ్చాత్యుల టెన్నిసు మొదలగువాటిలో స్వదేశీయములయందువలె గాక విపరీతమగు ధనము వ్యయముచేయుటచేతను. అయితే మరియొక సమాధానము వచ్చును. అది యెట్లన, స్వదేశీయములు గానిండు విదేశీయములు గానిండు వ్యాయామక్రీడలు బాలురకు తగినవి. కనుక నా చిన్నతనపు చేష్టలగురించి పెద్దలు విశేషముగ విచారింప నవసరము లేదు. అని.

ఇపుడు పైన చెప్పిన ప్రశ్నలు లేక సమాధానములకు యథాక్రమముగ రవంత ప్రత్యుత్తరమును విచారించి చెప్పుదము. మొదటిదానికి—ఐరోపియనుల కున్నట్లు అనుటలో వారియభిప్రాయము మేమో తర్వాత గనవచ్చునుగాని మన కున్నవా లేవాయను విషయమునకు ఈ ముందున్న పుస్తకమే ప్రత్యుత్తరము. రెండవదానిలో ప్రయోజనములను హేతువులను గురించిన సమాధానప్రశ్న చాల గహనమయినది. దీనికి ప్రత్యుత్తర మిచ్చుటలో, క్రీడా వ్యాయామములు చిన్నతనపు చేష్టలను పూర్వాచారపరాయణుల నమ్మకము గూడ శిథిలితమగును గాన కొంతవిపులముగ విచారింతము. కాని వెనుక వక్కాణించియున్నట్లు మనపూర్వులచే వ్రాయబడిన క్రీడా వ్యాయామ తత్వబోధక గ్రంథములు లేమిచే వారి యభిప్రాయముల నిట చెప్పజాలము. వాటికై వెదకుదము. ప్రస్తుతము పాశ్చాత్యుల వాదములను చర్చింతము. అమెరికాలో విస్కా-నుసిను రాష్ట్రమునకు చెందిన 'గిల్లు' పండితుడు వ్యాయామ క్రీడలకు గల సాంఘికప్రయోజనములగురించి (Sociology of Recreation) వ్రాయుచు, 'బాలు రాటల నాడుటకు హేతువు అట్టి కృత్యముల జోనుపు బాలరోగ మొందుచుండుటయే యని తేల్చెను. దీనిని 'బాల్యరోగవాద' మని పిలువవచ్చును. ఇది మన పూర్వాచారపరాయణులకు పెన్నిధనమై గన్పట్టవచ్చును. కాని పైవారిలోనె కొందరు కొందరు కొన్ని క్రీడ

లయందు వ్యసనములు యుండుటను, నిమ్నజాతులలో నిచటను, అన్నిజాతులలో నితరదేశములలోను పెద్దలుగూడ నివిషయముల నాసక్తులయి యుంట గన్నచో, అది సర్వసాధారణమగు రోగమె యగుటచే ఆయాస నిరాసయగును. అయితే బాలురాటలందు కడునాసక్తులగుటయు, పెద్దలకు ముఖ్యము విధుల నెఱవేర్చుటయె యనుటయు నిర్వివాదాంశము. కాని బాలురకైనను నాంగ్లభాషలో సామెత చెప్పినట్లుగా అంతయు పనియెగాని ఆటలేనిచో చురుకయినవాడును చందగును. అట్టి ప్రవృత్తము పెద్దవారియందును గన్పట్టును. బహుశః బాల్యావస్థలో ననుకరణశక్తియు, ధారణాశక్తియు మెండగుటచే నీయావశ్యకతయు నెక్కువ గావచ్చును. మరియొకవాదము గలదు. ఇది 'సర్వక్రీడావాదము.' ఇందువలన మనము 'ఆట' యని పిలువకున్నను, జన్మమొదలు మృతిపర్యంతము వివిధజీవితావస్థలయందు సల్పు కృత్యములన్నియు క్రీడలె యని పర్యవసానము తేలును. శాస్త్రములందు గన్పట్టనివియు ధర్మసంబంధములై లేనివియు నగు నుత్సవముల నెన్నిటినో జరుపుచున్నాము, అవి యాటలుగాక మరియేమి? పేరంటములు, ముస్తిగుడుములు పంచిపెట్టుట, పల్లుపోయుట, వివాహాదులయందు వసంతోత్సవములు చేయుట మొదలగు నవి యేమి? మతవిషయములయందు గూడ, నాట్యములు, మధుపానములు, కేకలు, పదములు, చిందులు మొదలగున

వేమి ? సాంఘిక వ్యాపారములయందు, కంచుకోత్సవము లు, విందులు, పాటకచేరీలు, రాజసంస్థానములను, నితరస్థల ములను గల, వేనవేలు మర్యాద లేమి ? ఉత్సాహము గల వారిచే పండితులకును, కళావిశారదులకును, స్పర్ధసభల నే ర్పాటు గావించి, అందు వాదములు, ఉపన్యాసములు, గుఱ్ఱపు స్వారీలు, మల్లయుద్ధములు మొదలగు చిత్రములు చేయించుట లేమి ? ఇవి యన్నియు క్రీడ యనని ప్రపంచమంతయు క్రీడ యే నను మనపూర్వాచారపరాయణుల కది గుచింపక పోగూడదు.

ఇది యిట్లుండ క్రీడావాదచరిత్రలో మూడు అవస్థలు స్పష్టముగ గన్పట్టుచున్నవి. అవి యెవ్వి యన (౧) కాయిక ప్రయోజనవాదావస్థ (౨) మానసిక ప్రయోజన వాదావస్థ (3) సాంఘిక ప్రయోజన వాదావస్థ. ఇందు మొదటిదానిని గ్రహింతము. ఈ వాదమున హార్బర్టు, స్పెన్సరు, కార్లగ్రోసు ననువారు ముఖ్యులు. స్పెన్సరు పండితుడు ఆటయాడు ప్రతి మనుజునికిని ముఖ్యముగ బాలురకు, శరీరములో శక్తి యెక్కు వయుండుననియు, దానిచే గల్గిన కించుమాత్ర నివారణచేసికొను టకయి యాటలనాడి యాశక్తిని వ్యయపరచుకొనును. అని చెప్పియున్నాడు. రెండవ పండితుడు మృగములలో నేమి, మనుజులలో నేమి ముందు రాబోవు కష్టనిష్ఠురములకు తమ శరీరముల నలవడ జేసికోవలె నను స్వభావేచ్ఛయుండుననియు అందుచే నందుకు పనికివచ్చునట్లు అన్ని జాతుల జంతువులలో

ను క్రీడ లేర్పడి అవియె యిప్పటికిని నిల్చియున్నవనియు నుప పాదనచేసెను. ఈ వాదముల ఖండించినవా రిద్దరు గలరు. వారు 'పాట్రికు' 'బ్రూసు' అనువారు. పాట్రికు మనకిపుడు వాడుకలోనున్న యాటలలో కొన్ని జీవయాత్రకు తరిబీయతు చేయునవి కావనియు, కొన్ని యందులకు వ్యతిరేకఫలముల నిచ్చునవి సయితము గలవు. అందుచే పైనచెప్పిన రెండవవాద మసమంజస మనియు ననెను. ఇంతియగాక మనమిపుడు క్రొత్తయాటలను గూడ కల్పింపగలము. వాటివలన గూడ సత్ప్రయోజనములు సిద్ధింపవచ్చును. కనుక మంచికో చెడ్డకో ఏర్పడివచ్చుచున్న జాత్యభ్యాసములు గాని యాటలు మరి వేరుగావనియు ననెను. 'బ్రూసు' తనలోనున్న సామర్థ్యాధిక్యమును వ్యయపరచుకొనుటయె ముఖ్యప్రయోజన మయినచో, జనులు ఆటల చూచుటయందు గూడ మిక్కిలి యాసక్తి జూపుదురె, ఏలయొల్లు? అందు ఆనంద మను మనోధర్మపు ప్రయోజనము గాని వేరు గాదు, అని మానసికప్రయోజన వాదమును సూచించి వదలెను.

అంతట మానసిక ప్రయోజనవాదులు, క్రీడావ్యాయామాసక్తికి మూలకారణము, ఆనందేచ్ఛ యను మనోధర్మమె యనియు, ఈ క్రీడావ్యాయామములచే నా మనోధర్మ ముత్తేజితమగుననియు వక్కాణించి, వీనిచే గల్గు మానసికప్రయోజనముల నీరీతిగ వర్ణించిరి. (౧) ఈ యానందము 'సంతో

షము నగముబలము' అని క్రమముగ శరీరసౌష్ఠవమును సమకూర్చును. శరీర మభివృద్ధి నొందినకొలది, మనస్సౌష్ఠవము శరీరారోగ్యమూలకము గాన, దీనిచే బుద్ధికి చురు కేర్పడును. దీనిచే మనుజుడు సంసారమహాసంగ్రామమునకు సన్నద్ధుడగును. (౨) ఈ వ్యాయామక్రీడలచే నాటగాండ్రకు పరస్పర సహాయాభిరుచి యేర్పడును. ఇందుకు నిదర్శనము సంఘీభావము కల మృగములు, ప్రకృతినుండి సంభవించు విపత్తుల నుండియు, విరోధ వ్యాఘ్రములనుండియు వేటగాండ్ర మొదలగు మనుజులనుండియు, పరస్పర సాహాయ్యము సల్పికొని తమ్ము రక్షించుకొనుటయె. (౩) చేష్టలన్నియు సంకల్పములు లేక, కోర్కెలనుండి పుట్టును. కోర్కెలన్నియు నానందాది మనోధర్మములనుండియె కల్గును. కాన మనోధర్మముల తగినంత నభివృద్ధి నందించునవి యన్నియు తత్సంకల్పముల తగురీతిని నభివృద్ధిచేయును. అందుచే ననురూపమగు కృత్యములనె మనుజుడు చేయును. అందుచే తగునడవడి యేర్పడును. కనుక న్యాయ్యముగ నానందమును, తత్సంకల్పములను నభివృద్ధిచేయు నివ్యాయామములు, సత్ప్రవర్తన గల వానిని గూడ జేయును. ఈ సందర్భమున నాంగ్లేయుల 'Fair Play' 'న్యాయ్యక్రీడ'యని యుక్తార్థముగల గొప్ప విషయములయందు గూడ వాడబడు న్యాయము గనదగినది. పైన చెప్పిన విషయము మన శ్రుతిస్మృతులందు గూడ

ప్రతిపాదన చేయబడినదె. కాని యింతతో నయిపోలేదు.

ఇక సాంఘిక ప్రయోజనవాదు లీ ముందుకో చూడవలెను. ప్రథమమున సమూహమున చేరినపుడు మనోవ్యాపారముల విచారింపవలెను. ఆటగాండ్రు జనసమూహమునందున్నపుడు క్రొత్త క్రొత్త యాలోచనలు గల్గుచుండును. క్రొత్త క్రొత్త విచిత్రములను గాంచి క్రొత్తయానందము నొందవలెనను కోర్కెలును, క్రొత్త ధైర్యసాహసములును ఆవిర్భవించును. అందుచే జనసమూహముచే సూచింపబడినపుడు, ఎక్కువ యానందము గల్గును. ఇట్టి మనోధర్మోత్తేజన మావశ్యకము. పల యన సట్టిభావవ్యాప్తియును బుద్ధియె ప్రవర్తనయందలి దార్ఢ్యము గల్గును. అందుచేత మనోధర్మములు దృఢములు కానిచో పురుషుడు కార్యశూరుడు కాజాలడు. కనుకనే పూర్వకాలమున మహోత్సవములయందును, సాంఘికోత్సవములయందును నాటగాండ్రు వరిముల ప్రదర్శించి కొనియెడివారు. మనుజుడనాగరికదశలో, వన్యమృగములతోను విరోధులతోను పోరాడునపుడు, ఈ మనోధర్మముల నభివృద్ధి చేసికొనియెడివాడు. ఇపు డున్నవో నాగరికత యభివృద్ధియగుటచే, వాటిస్థానే కళలు, సంగీతము, సంఘభావము, వ్యాయామక్రీడలు సీటియం దభిరుచి జూపును. కనుక నివి పూర్వోక్తములకు ప్రతినిధులు, అని.

ఈ ప్రకారముగ హేతువులను, చాలమట్టుకు ఫలిత

ములను చౌధరి యనువారు పైనచెప్పిన మతముల నుపపా దించుచు 'ఆధునిక విమర్శన'మను పత్రికలో ప్రచురించిరి. ఇక ప్రయోజనము సమానమెగనుక పరస్త్రీడయు తగు నన్నం దుకేమి సమాధానము? ఇందుకు మనపూర్వులు తమశాస్త్రములయం దిచ్చెడి ప్రతిప్రశ్న యొకటి గలదు. అది మొదలు సూచింతము. ఆనందము, సౌఖ్యము, ఆరోగ్యము శిశూత్పత్తి యను ఫలితమును సమానముగ యుండగా, అన్ని మతములయందును జాతులయందును, స్వభార్యయె తప్ప పరభార్యగాని, సామాన్యగాని పనికిరాదను నియమమేల?' స్వధర్మము, స్వభావ, స్వాచారము, మొదలగువాని ననుష్ఠించుటయును నీతిలోని భాగమె గనుక వెంటనె యాగ్రహ మొందక పైదానిని నెమ్మదిగ విచారింతురు గాక. ఇంతియ గాక మనదేశములోని జాతిపరిశ్రమాదులన్నియు క్రమముగ నశించుటగని, ప్రభుత్వమువారె దేశీయమును, అనింద్యము నగు ప్రతివిషయమును పునరుద్ధరణము చేయ ప్రయత్నించుచున్నారె. అందుచేతనె పాఠశాలోపద్రష్టలు, ఇనస్పెక్టరులు గూడ, 'దేశీయ వ్యాయామాదుల పాఠశాలలలో నుద్ధరించుట మాయభిమతము' అని సంపూర్ణముగు సానుభూతిని జూపుచున్నారు. ఇంతమేల, తనకు ప్రత్యక్షస్థితియే లేక అప్పటప్పటి కున్నస్థితులబట్టి మాత్రమె బ్రతుకువానికితప్ప తక్కెల్లరకును, స్వధర్మములను, స్వభావలను, స్వాచారములను,

స్వాకారములను, స్వవ్యాయామవిహారములను నశింపకుండ నిల్పుకొని స్వపృథక్త్వతిని గట్టిపరచుకొనుట యావశ్యకము.

ఇక, 'మనకేవియో నాట్యగున్నను, నవి యసంస్కృత ములు, నవైజ్ఞానికములు, పెద్దవారాడుటకు ననర్హములు అను విషయమును విచారింతము. మొదట నేవియో నాట్యగున్న ననుటకు హేతువు మనయజ్ఞానము, ననాదరణము గాని వేఱు కాదు. ఈ ముందున్న పుస్తకములో జెప్పినవి కొన్ని మాత్రమే. అవియును స్థూలముగ తెల్పబడినవి. అన్నిటిని సంగ్రహించి వాటి నియమములను పూర్ణముగ వ్రాసి, గుణాగుణములను చర్చించినచో, ఇవియె కొన్ని సంపుటము లగును. సంగ్రహ ముగ వ్రాసినపుడు ఇతర దేశీయుల క్రీడావ్యాయామములును కొన్నిపుస్తకము యగును. సంస్కారములన్ననో తగుయోగ్యత గలవా రాదరించి చేసినగాని రావు. అట్టివారు గ్రహించిన మీద రాకమానవు. వైజ్ఞానికలక్షణములు పాశ్చాత్యుల క్రీడా వ్యాయామములకు హెచ్చుగుటకును వారియాదరము కార ణము. పెద్దలాడుట కనర్హము లనుమాట యర్థములేనిమాట. పెద్దవారికి తలంపు పుట్టినచో దేనినైన తమకు పనికివచ్చు నట్లు చేసికొందురు. చేసికొన్నతర్వాత నన్నియు నర్హములే. దృఢశరీరులు బిచ్చమెత్తుట ఇంగ్లాండులో తప్పిద మయినను, బ్రాహ్మణులు, సాతానులు, జంగములు మొదలగువారిచే నాదరింపబడి ఇచట నది గర్హ్యముకాకనె యుండినది. ఇట్టి

వారి కన్నియు కుయుక్తులును కువాదములు గాన నింతట విర మించి ఆటలవలన ఫలితముల కొన్నిటి నిట సంగ్రహింతము.

(౧) కార్యభారముచే కొంచెము లసియున్న మనస్సులకును, శరీరములకును రుచ్యములయి, యాటలు, మనశ్శరీరముల కుల్లాసమును గల్గించి బలము నిచ్చును.

(౨) ఎప్పుడు నొకటియె కార్యమును చేయుచుండుటచే కలుగు విసుగును పోగొట్టును.

(౩) బుద్ధి వ్యాపారములను చురుకు నొందించును.

(౪) ప్రయోజనమున కనుగుణముగ నుండునటుల తత్సంపాదకములగు మార్గముల నమర్చుకొను నేర్పలవడును.

(౫) లోకయాత్ర కత్యావశ్యకములగు సమయమున విచారించుట, ఆసమయముననె నిశ్చయించుట, ఆ సమయముననె పనిజరుపుట యను శక్తులను దృఢపరచును.

(౬) ఆటగాండ్రలో కొందరికి గల మేకపోతుగాంభీర్యమును త్రోసిపుచ్చి, వాస్తవికములగు మనస్థితుల వెలిబుచ్చి, అందుచే వారికి పరస్పరసాహాయ్యము, విచారణైక్యము, భావైక్యము, ప్రయోజనైక్యమును గల్పించును.

(౭) సాధారణముగ, మతమునకు విభాగముల జేసి జనుల విడదీయు స్వభావము గలదు; క్రీడావ్యాయామముల కన్ననో, వారిని కలియజేసి ఏకీభావము గల్పించు స్వభావము గలదు.

# జాతీయ యోగవ్యాయామ క్రీడలు

---

## ౧ కోటాట.

ఆటలన్నిటిలో కోటాటను రాజనవచ్చును. కోటాట లేక కోట ఆట అనగా నొకని కోటను నాని వీరభటులు రక్షించుచు శత్రువులను కోటలోనికి రానీయకుండుటకు శత్రువులతో ద్వంద్వయుద్ధము చేసి వారిని తొలగించువిధము ననుసరించి కల్పింపబడిన యాట.




ఈ యాటక్రమ మీ పటమువలన తెలియబడును. మధ్యను చతురస్రముగ నున్నది కోట. కోటకు రెండు ద్వారములకు తక్కువ కాకుండ ఆరుద్వారములకు మించక యుండవలెను. ఈపటమున నారుద్వారము లుంచబడినవి.

ఆరుద్వారములను కోటను రక్షించుటకు ఒక్కొక్క ద్వారము వద్ద ఇద్దరేసి రాచవీరు లుండవలయును. ఈపటమున కోటను కాపాడుటకు నేమింపబడిన రాచవీరులకు ◡ గురుతు వేయు బడినది.

గురుతు × గురుతు ప్రక్క నె (( కూడ వేయబడి యున్నది. (( గురుతు శత్రుసేనలోని వీరునకు సంజ్ఞ. ఆరు ద్వారములవద్దను × వేయబడిన చోట్లయందు ద్వారమున కిద్దరు చొప్పున 12 గురు రాచవీరు లుండవలయును. వారిని ఎదుర్కొనుటకు (( గురుతు వేయబడిన స్థలములో 12 గురు శత్రువీరు లుండవలయును. శత్రువీరులు కోటలోనికి ప్రవేశించుటకు ప్రయత్నింతురు. రాచవీరులు శత్రువీరులను కోటలోనికి రాకుండ ప్రయత్నింతురు. ఇట్లు ఆరుద్వారముల యందు × గురుతుగల రాచవీరులకును (( గురుతుగల శత్రువీరులకును ద్వంద్వయుద్ధము జరుగును.

అనగా నొకరినొకరు ముందునకు త్రోసికొనుట. ఈయాటలో నొకరినొకరు కొట్టుకొనరాదు. ఇరువురును తమకుగల బలముల నుపయోగించి ఒకరినొకరు స్థలమునకై త్రోసికొనవలయును. × (( గురుతులకు మధ్యను అడ్డముగ నున్న స్థలము రాచవీరులకును శత్రువీరులకును సరిహద్దు. శత్రువీరులు సరిహద్దుదాటి ఒక్కమారు లోనికి త్రోసికొని వచ్చినయెడల తా నాద్వారమును జయించినట్లే. ఇట్లు

12రు శత్రువీరులును తమ్ము నెదురించుచున్న 12 రాచవీరులను ఓడించినయెడల శత్రువీరులు కోట నాక్రమించి రాచవీరులనోడించి రనవచ్చును. ప్రతి శత్రువీరుడును తన్నెదుర్కొనుచున్న రాచవీరుని జయించిన జాలును. కాని అన్ని ద్వారములు శత్రువులకు స్వాధీనమై ఒక్కద్వారమును మాత్రము రెండుస్థలములయందు గాని ఒక్కస్థలమందు గాని

౨ గుండాట.



ఇ

రాచవీరులు శత్రువీరులను లోనికి రానీయకున్న యెడల శత్రువులే ఓడుదురు. ఈప్రకారముగ నీయాట నభ్యసింప వలయును.

ఈయాటకును 2 కక్షలుండవలయును. ప్రతిపక్కను ఆరుగురు తక్కువ కాకుండ నుండవలయును. పటమున కనుపరచిన విధమును ఈకక్షవారు ఆరుగురు ఒకవైపున ఆకక్షవారారుగురు నొకవైపునను ఒకేసమానముగు పంక్తులలో నిలువబడవలెను. పటము * ఒక గురుతుగల యోగ బాలికల కక్షకు సంజ్ఞ. ⌓ మరియొక యోగ బాలికల కక్షకు సంజ్ఞ. ఈసంజ్ఞలుగల కక్షలవారికి ౨ గురుతున్న పాతియున్న పతాకము గుర్తు నిలువబడి స్థిరముగ నుండవలెను. ఆ గురుతున్న మధ్యవర్తి యొకరు గుండు నొకటి చేతియందుంచుకొని యుండును. ఈ మధ్యవర్తి బాలికల వెనుక నిలిచియుండి 1, 2, 3, అని మూడు మార్లు లెక్కించి ౨ దగ్గరనున్న పతాకము వైపు గుండు విసరివేయును. అలాగు విసిరిన గుండును ఇరుపార్శ్వములయందుగల బాలికలు పట్టి తేవలయును. ఎందులో నేగురుతుగల బాలికలు నియమానుక కాలమున నెక్కువసార్లు గుండు తెచ్చిన వారే యాటను జయించినట్లు. గుండును సమీపించుటలో * గురుతుగల వారిలో నొకర్తు ముందుగ సమీపించె ననుకొందము. ఆ బాలిక కొకవేళ చేతిలో గుండు పట్టుకొనుటకు తగినంత వీలు చిక్కనప్పుడు ఆమె తనకాలితో గుండును తన కక్షవారి వైపు తన్ని వేయవచ్చును. అప్పుడది యెవరికి మొదట చేతికి దొరకునో వారే గెలిచినట్లు తీర్మానింపబడవలెను.

## బయటనాడు నాటలు

### ౧ ఈత, లేక ఈదుట

ఈత సాధారణముగా నీదునది నాలుగు విధములు. ౧ కుక్క యీత, ౨ బార యీత, ౩ వెల్లకిలపడి ఈదుట, ౪ నిలువు ఈత. ఈత లన్నియు దాదాపుగ నందరికి దెలిసి నవియే. అందుచే వీనిని గురించి ఎక్కువవ్రాయ నవసరము లేదు.

౧. కుక్క యీతయందు శరీరము నీటిమీద బోరగిల జాచి వెనుక "కాళ్లు కొట్టు"చు ముందు చేతులతో తన ప్రక్కల క్రింది నీళ్లు వెనుకకు లాగివేయుచుండుట, కాళ్లను నీటిలో అడుగుకు తన్నుటయు కలదు.

౨. బార యీతయందు కాళ్లు కొట్టుటయే నదలి చేతులుచాచి బిగియబట్టి అరసున్నమార్గమున విసరి ప్రక్కనుండి ముందుకు వేసి నీటిని తన ప్రక్క క్రిందుగ లాగివేయుట.

౩. వెల్లకిల యీతలో నీటియందు శరీరమును వెల్లకిలచాచి కాళ్లు కొట్టుచుగాని, బిగియబట్టిగాని, చేతులతో ప్రక్కనిరు పైకి లాగివేయుట. కాళ్లకు బదులు చేతులూరక యుంచి కాళ్లుకొట్టుచు లేక కాళ్లతో నీరును ముందుకు తన్నుచు కూడ నీదవచ్చును.

౪. నిలువీతకు పైవాటిలో నేర్పరియై యుండవలెను. శరీరము నిలువుగనే యుంచి కాళ్లతో నీటిని క్రిందికి తన్నుచు

చేతులతో ముందునీరు వెనుకకు లాగుచుగాని, నేర్పున్నచో చేతులు ఊరకనే యుంచిగాని యీదుట కద్దు.

ఒక్కొకప్పుడు రెండు కాళ్లను నీటిలో నొక్కమారే తన్నుచు రెండు చేతులతోను ఒక్కమారు బార తీయుచు ముందు కురుకుదురు. దీనిని "కప్పయీత" యందురు.

బాగుగ నీత నేర్చినవారు కొందరు వెల్లకిల యీతతో వలె నీటిమీద పరుండి కాళ్లను చేతులను కదలింపకయే శవమువలె తేలి కొట్టుకొని పోవుచుందురు.

"తెప్ప"యీత మరియొకటి కలదు. ఇది బారి యీతకంటె భిన్నము కాదు. కాని దీనికి బాడిశె చెట్టు మొదలగు చులకని కర్రతో చేయబడిన సుమారు అయిదడుగుల పొడవుగల "తెప్ప"యను కొయ్య ఒకటి యుండును. దీని ముఖము పైకి ఆదోకుగ తేలునట్లును పైభాగము బల్లపరుపుగను చెక్కియుండును. దీనిని దూరము ఈదవలసి వచ్చినప్పుడు వాడుదురు. ఈతగాడు దీనిపై బోరగిల పరుండి తొడలతో తెప్పను చెదరకుండ బట్టి బారయీత నీదును.

ఈతవలన కలుగు లాభము మెండు. దేహమునకు మంచి పరిశ్రమ కలుగును. ఊపిరి తిత్తులు బాగుగా బలపడును. ఈత నేర్చుకొని యుండుటవలన నీటి యపాయము నుండి మనల రక్షించుకొనుటయే గాక యితరులనుకూడ రక్షింప గలుగుదుము.

*

౨ ఉప్పుబరి.—చర్ చూడుము

## 3 ఓలలాడుట.

ఇది నీళ్లలో నాడునాట. ఈ యాటలో నెంతమంది యైనను నాడవచ్చును. ఇది యాడువారలు నీటిలో మునుగుటకు మరియొక స్థలమున తేలుటకు బాగుగా నలవడి యుండవలెను. ఇందులో నొక "దొంగ" యుండును. వాడు తడవతడవకును నీటిలో మునిగి నీళ్లలోనుండి మన్ను తెచ్చి నీటిలో మునుగకుండ బయట నున్నవారిమీద నెవరిమీదనైనను "ఓల, ఓల"యని కేక వేయుచు వేయును. ఇట్లు చేయుటలో ఒక పర్యాయము తెచ్చినమన్ను ఒకనిమీదనే వేయవలయును గాని దానినే అందరిమీదను వేయకూడదు. ఇతరులును వాడు మన్ను విసరివేయునంత దూరములోనే యుండవలెను. వారు సదా యేకదృష్టితో "దొంగ"యొక్క దృష్టిని కనిపెట్టి యున్నవారలై వాడు విసరివేయు తరికి దభాలున నీటిలో మునుగవలయును. ఇట్లు మునిగి నీటిలో ప్రాకిపోయి ఎక్కడనో మరియొకచోట తేలుదురు. వాడు వేసిన మన్ను ఎవరిమీదనైన పడినయెడల అంతట వాడు "దొంగ" యగును. ఇట్లు ఆట జరుగుచునే యుండును. ముగింపుచేయ దలచుకొన్నచో రెండవవానిని దొంగను చేయుటతోనే వెనుకదొంగ ఆటలోనుండి ఆగిపోవుచు అందరు దొంగలగునప్పటికి ఒకయాట యని లెక్క చూచుకొనవచ్చును.

ఇది ముఖ్యముగ మనోవిలాసార్థ మాడుదురు. ఇందలి చురుకుతనము, నీట మునుగుటవలన నీరన్న నిర్భయము, ఆత్మ సంరక్షణశక్తి మొదలగునవి చక్కగ గ్రహింపనగును.

౮ కండె, రెళ్ళ.—గోదుఱిళ్ళ చూడు.

౯ కాడిమేడి.—గోదుఱిళ్ళ చూడు.

౧౦ కఱ్ఱబంతి లేక కుండబంతి.

పేరును వినినంత మాత్రముననే ఈయాటనుగురించి ప్రతిమనుజునికి కొంచెము తెలియుచున్నది. ఇందలి బాలురకు గావలసిన పరికరము లతిస్వల్పములైనవి. ఒక వెదురు కఱ్ఱయు, ఒక త్రాడుబంతియు చాలును. ఈయాట నాడుటకు ౫ గురు మొదలు ౧౦ గురువరకు కావలెను. వీరు రెండు సమానపక్షములుగ చీలుదురు. సమభూమిమీద రెండు చిన్న యిటుకరాళ్లు కొంచెము దూరముగా బెట్టి వాటిపై నొక వెదురుకఱ్ఱను పెట్టుదురు. ౧౫-౨౦ గజములు గల సమాన దూరముల రెండు పక్షులవారును నిలుతురు. రెండు పక్షము లందును, బంతి విసరి "వేయుట"కు నిద్దరిని, బంతిని "పట్టుకొనుట"కు నిద్దరిని, నియమింతురు. "వేయు"వారు తాము నిలుచుచోటునుండి బంతిని విసరవలెను. మొట్ట మొదట నొక పక్షపులోని వారిలో నొకడు నియమిత దూరమునుండి బంతిని విసరి వెదురుకఱ్ఱ యిటుక

(ు) ఇది సంక్షీకరణమందు శక్తము లగుటచే జాతిమతాది భేదములచే భిన్నభిన్నము లయియున్న రాష్ట్రముల యందు జాతిపునరుద్ధారమున ముఖ్యహేతువు లగు నని—చౌధరిగారు కనఁబరచియున్నారు.

ఇతర దేశములలో చూచినచో, ఆబాలగోపాలము వీనియందును శ్రద్ధగలవారయి, వాటిని జాతీయోద్యమము లుగ నెంచి, లక్షలకొలది ధనము వానిమీద వ్యయముచేసి, వాటిచే పూర్ణముగులాభము నొందుట గనుచునేయున్నాము. అచ్చట దేశము మొత్తముమీదను, ప్రతి సంస్థాపనకు సంబంధించియు, ప్రతిపాఠశాలయందును, ప్రతిగృహమునందును, వ్యాయామక్రీడలకు తగువసతులు గల్గియేయున్నవి. అందు తగు నుపకరణముల చేయుటకై ప్రత్యేకము వర్తక సంఘము లేర్పడియున్నవి. మనదేశమందన్ననో, పాఠశాల లయందు అచటనచట క్లబ్బులయందును ప్రభుత్వమువారు కరుణించి గాని, పరాచారపరాయణు లంధపరంపరగా గాని పెట్టిన విదేశీయ వ్యాయామక్రీడలు తప్ప దేశీయములు కానరావు. ఇదివరలో నున్న తాలింఖానాలు మొదలగునవి క్రమ నాశము నొందుచున్నవి. మనబాలురలో నాటలను సరిగ నాడునారు నూటికిరువదిమందియైన కలరో లేరో. పెద్దవారిలో నాంగ్లభాష నేర్చిన కొందరును, మిక్కిలి పూర్వపద్ధతుల ననుష్ఠించుచున్న నిమ్నజాతులలోని కొలదిమంది తప్ప నెవ

రును వీటిని గడ్డిపోచగానైన లెక్కించుటలేదు. ఇందుచేతనె మనలకు దేహదార్ఢ్యభాగ్యము దినదినప్రవర్ధమానమగుచున్నది. ఈ విషయమును గురించి యింత విపులముగ వ్రాయుటకు, బాల్యావస్థలో నాటలయందు నల్పశ్రద్ధ కల్గి, శక్తినంతను చదువునకె ధారవోసి, దుర్బలుడను రోగగ్రస్తశరీరుడనునయి 'తడిసి గుడిసె కట్టిన నాకన్న మరియొకడు అర్హుడుకాడను నమ్మకమే ముఖ్యకారణము. ఏలయో కాని మొదటినుండియు వ్యాయామక్రీడలు, ధర్మ్యము లయినను కావలెను, దేశీయము లయినను కావలెను; కాకున్నచో స్వాభావికోపచయము గల దేశీయములవలె గాక, అన్యదేశీయములు జాతీయ జీవనభంగమునకు తోడ్పడు నను నమ్మకముచే నిట్టిపాత్రము గూర్పింప ప్రయత్నించుచునే యుంటిని. అట్టి యీపేదకు పెన్నిధివలె శ్రీ ప్రొఫెసరు॥ బులుసు రామజోగారావుగారు, తెనాలికి విచ్చేయుట, అచ్చట నొక 'యోగవ్యాయామశాస్త్ర కళాశాల' స్థాపించుట, అప్పటి స్కూళ్ల ఇనస్పెక్టరుగారగు శ్రీ॥ రావుబహదూరు వి. వెంకట్రామయ్యరు బి.ఏ., ఎల్. టి గారును హైస్కూలు హెడ్మాస్టరుగారగు శ్రీ॥ పి. ఏ. సుబ్రహ్మణ్యయ్యరు బి. ఏ. ఎల్. టి గారును, ఆయుద్యమము నుత్సాహపరచుటయెగాక స్వపాఠశాలలో గూడ దేశీయక్రీడావ్యాయామముల నుత్సాహపరచుటయె తమయభిప్రాయ మని శ్రీ॥ ఇనస్పెక్టరుగారు వక్కా

శించుటయు సమకూరుటచే, శ్రమ యనక నిద్రాహారముల కాయిన తడవునకు సయిత మోర్చి కొలదిదినములలోనే యీ పుస్తకమును కూర్చిన బులుసు - రామజోగారావుగారికి అన్ని విధముల సహాయ మొనర్చిన మావిద్యార్థులు, చిరంజీవులు, పెనుమర్తి శివరామయ్య, మునుపల్లి నరసింహారావు లెంతయు మా యాశీఃపాత్రములు. మాకళాశాలాధ్యక్షులును, ఈ యుద్యమమున కింతకును కారణభూతులును, ఈ పొత్తము నచ్చొత్తించుటలోని వ్యయప్రయాస లన్నియు తామే భరించి, నిర్ధనమగు మాకళాశాలకు నిఖిలలాభము నిచ్చుట కనుగ్రహించి, సమయమున కాదుకొన్న శ్రీ॥ బు. రామజోగరావుగారు మావందనశతములకు పాత్రులు. మరియు సుచితముగ నీపొత్తము నచ్చొత్తించి మాతృదేశసేవ చేసిన శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారికి మా వందనశతముల నర్పించుచున్నారము.

ఈ పొత్తము నింత శీఘ్రముగ సమకూర్చి, రాబోవు 'ఆంధ్రమహాజనసభ' కాలమునకు ప్రకటింపవలెనని సమకట్టుటచే, గ్రంథము యొక్క కాయవృద్ధి చేయుటకును, సంస్కారములను చేయుటకును వలనుపడినదిగాదు. ఇట్టివన్నియు శ్రీ॥ ప్రొఫెసరుగారు ప్రకటింపబోవు మాసపత్రిక ద్వారా సంగ్రహించి ద్వితీయముద్రణమున జరుపబడును. ఇంత శీఘ్రముగ తగు సమయములో నందునట్లు అచ్చువేసియిచ్చిన

శ్రీ॥ ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాలాధికారులగు శా. నాగేశ్వరరావుపంతులవారు మిక్కిలి స్తవనీయులు.

ఈ ముందు వచ్చు నాటలనుగూర్చి రెండుమాటలు చెప్పవలసియున్నవి. మన దేశీయ క్రీడావ్యాయామముల కనన్యాదృశము లగు లక్షణములు కొన్ని గలవు.

అవి యెవ్వి యన:—

(౧) విదేశీయ క్రీడావ్యాయామముల కనయవ రూపములగు నన్ని ముఖ్యభాగములును, ఇవి కల్గియున్నవి. గోలీలకును బిలియర్డ్సుకును, గోడిబిళ్లకు క్రికెట్టుకు, బంతి నాల్గుస్తంభముల యాటలకును బేసు బాలునకును గలమైత్రి ఆటలను చదువుచుండగనె తేటపడును.

(౨) విదేశీయములు విశేషధనవ్యయమును గోరును. స్వదేశీయములు గోరవు.

(౩) విదేశీయములలో నుపకరణములు విశేషము కావలసి యుండును. స్వదేశీయములలో బహుస్వల్పము.

(౪) ఉపకరణములు తక్కువగుటచే శరీరావయవములకే ఎక్కువ పాటవమును కౌశలిని ఆవశ్యకముగా కల్పించును.

(౫) స్వదేశీయములలో చాలమట్టుకు మనోవాక్కాయములు మూడిటికిని హిందువుల కర్మలందువలె నేకకాలమున ప్రవృత్తి గలిగియుండును.

ఇంక సూక్ష్మదృష్టితో విచారించినచో మరికొన్ని లక్షణములు తేటపడును. ఈ ముందు ప్రచురించినవి ఆంధ్రదేశములో ముఖ్యముగ కృష్ణా గుంటూరు మండలములలో నుండి తీయబడినను, చాలమట్టుకు మారు పేరులతోను, కొద్ది మార్పుగల పేరులతోను, కొద్ది మార్పులుగల నియమములతోను దేశమంతటను నాడబడుచునే యున్నవి. పెద్దవా రభిమానించుకొని యున్నతదశలోనికి తెచ్చినకాని వానిలో కొన్ని 'జాతీయక్రీడా' పదవి నొందవు.

"ఇంట నాడునవి" "బయట నాడునవి" యను విభాగమున కొన్నియాటలు రెండు లక్షణములు గలిగియుండుటచే, పేర్లను రెండుచోట్లను నుంచి, వర్ణన మొకచోట మాత్రమే చేయబడినది. ఇందు శకటరేఫలు నరసున్నలును పరిగణింపబడలేదు. ఈ యాటలన్నియు మగవారాడునవి యను పేరుతో ప్రచురింపబడుచున్నవి. అందుచే స్త్రీ లాడునవియు మరికొన్నియు తెలిసినను ఇందు చెప్పబడలేదు. కోళ్ల పందెములు జూదము మొదలగు గర్హ్య క్రీడలును వదలివేయబడ్డవి. ఇందు దొరకిన స్ఖాలిత్యముల సవరణలును మిగిలిన యాటల సంగ్రహణమును రెండవ కూర్పులో చేయబడును.

ఈ చిన్ని పొత్తము సభ్యు లాదరించి ఈ యుద్యమము యొక్క ముఖ్యత నరసి, స్వబాలురకు పాఠశాలలో నేమి, ఇంట నేమి, ఉత్సవసమయములలో నేమి, స్వక్రీడా వ్యాయామములనే ఆదరణీయములుగ నిర్ణయించి, నల్గురు బాలురు, నల్గురు పెద్దలునుమాత్రమే ఇందుచే స్వమార్గమునకు తిరిగినను మాపడిన శ్రమ సఫలమయినట్లు లెంచెదము. ముందు కావలసిన దేశీయక్రీడావ్యాయామోన్నతికి దేశీయుల వివేకమును భవితవ్యతయునే శరణములు.

6-5-15.
ఉయ్యూరు

ఇట్లు
కో. వెం. అప్పాశర్మ, ఎమ్. ఏ.

రాళ్లపైనుండి క్రిందపడునట్లు వేయును. వీడు "చచ్చి" పోవువఱకు బంతిని వీడే విసరి వేయుచుండవలెను. అటులనే రెండవ పక్షమువారుకూడ నొకడు నియమింపబడును. బంతి విసరివేసినప్పు డది కర్రకు దగిలి కర్ర క్రింద బడిపోయిన రెండవపక్షమందు "వేయు" వా "డయిపోవు"ను. అయిన వాడు మరల వేయుటలేదు. వానిస్థలము వానిపక్షమునం దింకొక డాక్రమించుకొనును. ఈ రెండవవాడు కూడ వా "డయిపోవు"వరకు బంతిని "వేయు"చుండును. ఒక పక్షము నుండి బంతి వేయబడినప్పుడు రెండవ పక్షమున "పట్టుకొనెడి" వాడు బంతి నొక్కసారిమాత్రమే క్రింద తగిలి పై కెగురగా పట్టుకొనినచో వాడు కర్రదగ్గరకు వచ్చి దానిని బంతితో క్రిందికి బడగొట్టును. అట్లు చేసినచో రెండవ పక్షమందలి "వేయు"వా డయిపోవును. తిరిగి బంతి యెగిరినపు డదేవిధముగా రెండవ వైపున "పట్టుకొను"వాడు బంతిని పట్టుకొనినచో వాడుకూడ కర్ర దగ్గరకువచ్చి దానిని బంతితో గొట్టి పడవేయవచ్చును. అప్పుడు రెండవ వైపున "వేయు"వాడు "అయిపోవు"ను. బంతి పై కెగిరినపు డదేవిధముగా నితర బాలురు దానిని పట్టుకొనినచో వారు కర్రదగ్గరకు వచ్చి కొట్టగూడదు గాని, యెక్కడ పట్టుకొనిరో యక్కడనుండి కర్రను కొట్టవలెను. ఇట్లాడగా చివర కేపక్షమువారు ముందు "అయిపోవు"దురో వా రోడిపోవుదురు.

ఈ యాటవలని లాభములు:—గురికొట్టుట బాగుగ చేతనగును. బంతిని బాగుగ విసరుటచే రెక్కకండరములు బలము చెందును. ఇది ఆంగ్లేయుల క్రికెట్టు అను నాటకు మూలమయి, ఆప్రయోజనమే కలిగి యున్నది.



౭ కుప్ప చెడుగుడు—చెడుగుడు చూడుము

౮ కొక్కు

మొగము
మొగము
౨ గజ
మొగము
మొగము
కుండ
౨ గజ

ఈ యాటలో ఒక్కొక పక్షమున ౬ గురు మొదలు ౧౦ గురు వరకు ఉండి ఆడవచ్చును. వీరు గజమున్నర కొకరు చొప్పున కూర్చుందురు. రెండు చివరలను స్థావరముగ రెండు "కుండ"లుండును. ఈ కుండలు మనుష్యులైన నుండవచ్చును. లేక కొయ్యలైన పాతవచ్చును. కూర్చునియుండువారిలో మొదటివా డొకప్రక్క మొగము రెండవవాడు దానికెదురు ప్రక్క మొగముగ తిరిగి యీవిధముగా నందఱు కూర్చుందురు. కూర్చున్న వారిపక్షపు వారిలో నొకడు, బాలుర చుట్టు తిరుగుచు నిలుచున్న వారిని తాకప్రయత్నించును. నిలుచున్న వారు మనుష్యుల సందుగా తప్పించుకొనుచుందురు. తాకప్రయత్నించువాడు మాత్రము మనుష్యుల మధ్యనుండి పరుగిడ కూడదు. కుండ, మనుష్యులమధ్యనుండి పరుగిడుట కొన్ని చోట్ల వాడుక గలదు. పరుగిడువా డలసినపుడుగాని లేక వేరొకని పంపుటచే సులభముగా నితరుల దాకవచ్చునని దోచినప్పుడుగాని తనపక్షము వాని నొకనిని వెనుకగా వచ్చి "కొక్కు" అని లేపి తత్ స్థానమున తాను కూర్చుండవలయును. లేచినవాడు యెదుట నున్నవానిని దాకవచ్చును. అందని పక్షమున తనకు పూర్వము పరుగిడిన వానివలెనే చుట్టు తిరుగుచు సమయానుసారముగ తనయిచ్ఛ వచ్చినవానికి "కొక్కు" కొట్ట (పెట్ట)వచ్చును. ఇట్లు నిలుచుచున్న వారందరు అయిపోవువరకు ఆటసాగుచుండును. పైనుదాహరింపబడిన

ప్రకారము, కూర్చున్న వారిలో నెవరైన "కొక్కు" పెట్టనిదే లేచిన యెడల నంతట వానికి "పిల్లపుట్టె"ను అందురు. లేక వాడు "పిల్లను పెట్టెను". చుట్టు గీటు దాటిపోయినచో వాడు తాకబడినట్లు ఎంచుకోబడును. నియమిత కాలము నం దేకడువా రెక్కువసార్లు కూర్చుందురో వా రాయాటను నోడిపోవుదురు. 'రంగము' కొలతలు పటమునందు చూప నగును.

ఈ యాటవలన పిక్కల కండరములు ముఖ్యముగా బలపడును. చురుకుతనము గలిగియుండుట నేర్చుకొందురు.

## ౯ కోతి కొమ్మచ్చి.

ఈయాట రెండువిధములు

౧ చెట్టుకోతి కొమ్మచ్చి. ౨ నేలకోతికొమ్మచ్చి.

### ౧ చెట్టుకోతి కొమ్మచ్చి

ఈ యాటకు సుమారు ౧౦ మొదలు ౧౫ వరకు నాటగాండ్రు కావలెను. ఆటగాండ్రనేక శాఖలు గల్గి పెద్దను కాకుండు నొక చెట్టు నేర్పఱచుకొందురు. సుమా రొకగజము పొడవు గల యొక వెదురుకఱ్ఱయు కావలెను. దీనినే కోతి యందురు. ఆటగాండ్రలో నొకని దొంగగా నియమింతురు. మిగిలినవారిలో నొకడు వెదురు కఱ్ఱను దీసికొని కాలిక్రిందుగ చాలదూరమునకు విసరివేయును. దొంగ కఱ్ఱనుదీసికొని వచ్చుటకు బరుగెత్తును. ఈలోపల మిగిలిన యాటగాండ్రం

వారు చెట్టుకొమ్మలపై నెక్కుదురు. దొంగ కర్రను దీసికొని “ వేడికోతి, వేడికోతి ” యని కూతబెట్టుచు చెట్టుదగ్గరకు వచ్చును. వాడు కూతవదలకయె నెవ్వానినైనను కర్రతో దాకినచో దాకబడినవాడు దొంగయగును. వాడట్లుచేయ లేనిచో కర్రను చెట్టుకొమ్మల క్రింద నొకచోట బెట్టును. అపుడు “కోతి” “చల్లారును”. అంతట వాడొక యాటగాడు గల కొమ్మపై నెక్కగాని మరి యేదియో విధముగాగాని తాకి తిరిగివచ్చి కర్రను తాక ప్రయత్నించును. ఈలోపల నితరులు క్రిందికి దుమికి కర్రను దీసికొన బ్రయత్నించుదురు. దొంగ యొక యాటగాని తాకి తిరిగి కర్రను నితరులు తాకక మునుపు తాను తాకినచో దాకబడిన వాడు తిరిగి “దొంగ” యగును. వెనుకటివలెనే కర్ర విసరివేయబడును. వీడుకూడ వెనుకటి దొంగవలెనే చేయును. అట్లుగాక కర్రను నితర బాలురు దాకినచో తిరిగి వాడే దొంగయగును. ఈప్రకారము ఆట యంతలో మూడుసార్లు ఒకడు దొంగ యయినచో అంతట ఆట ముగియును.

ఈ యాటవలన చెట్లను త్వరితముగ నెక్కుట, శరీరమునకు నతిలాఘవము, కౌశలియు నలవాటుపడును.

౨ నేలకోతికొమ్మచ్చి.

ఈ యాటయు వెనుకటి యాటవలెనే యుండును. కాని చెట్టు బదులొక సున్న నేలమీద గీయుదురు. “దొంగ”

కర్రను దీసికొనివచ్చి యా సున్నలో బెట్టును. వాడు సున్న దాటి వెలుపలికి రాకూడదు. ఇతరులు సున్న వెలుపల నుందురు. దొంగచే తాకబడకయే కర్రను సున్నలోనికి శీఘ్రముగ వచ్చి తీసికొన ప్రయత్నించుదురు. వెనుకటివలెనే తాకబడినవాడు తిరిగి దొంగ యగును.

ఈ యాటవలన ముఖ్యముగా పిక్కలబలము మేర్పడును. పలుగురినుండి తనసొత్తు కాపాడుకొను నేర్పును కలవడును.

## ౧౦ గాలిపటము.



ఈ యాట దాదాపుగ నందరకు దెలిసినదియే. గాలిపటమును కట్టుట కొరకె కాగితమును పెద్దదారమును కావలయును. కొన్ని గాలిపటములకు తోకకూడ కట్టుదురు. గాలిపటమునకు దారముకట్టి రెండవచివర చేత నుంచుకొని దానిని గాలిలో నెగుర వేయుదురు. ఒక్కొకప్పుడు గాలిపటముల పందెములు కూడ వేయుదురు. ఈ పందెములు విశాల భూములలో జరుగును. ఇద్దరు రెండు గాలిపటముల

నెగురవేసి యొకదానిచే నొకటిని గొట్టింప బ్రయత్నింతురు. ఎవరి గాలిపటము చినిగిపోయి క్రిందపడిపోవునో వాఁడా పందెము నోడిపోవును. ఈ పటములలోనె "రుంగిణీ" లని అనుగున ముమ్మూలలు పైన అరసున్నయాకారము కలిగినవి గట్టిదారముతో చేయుదురు. అవి చాల పైకబోయి మనుష్యుని నూగించు బలముతో నాడుచుండును. ఇట్లె కాగితములో బుట్టలుచేసి వానిలో దీపములు పెట్టి పైకి వదలివేయుదురు.



౧౧ గుఱ్ఱపుస్వారి — స్వారిమాడుము.

౧౨ గోడుబిళ్ల.

ఇది, చిత్రబిళ్ల, బిళ్లంగోడు, గోడిబిళ్ల అను వివిధ నామములచే బరగుచున్నది. వీనిలో 'బిళ్లంగోడు' అను పేరు మిగుల వాడుకలో కలదు. ఇది విశాలమైన బయలు మీద నాడెదరు. ఈ యాట నాడుటకు ముప్పాతికగజము మొదలుకొని గజమువరకు పొడవుగల కఱ్ఱయును, సుమారు ౬ అంగుళములు పొడవుగల బిళ్లయు కావలెను. బిళ్లంగోడు నాలుగువిధములు:—౧ కండె, రెళ్లఆట; ౨ లాలార్థి, 3 రుజ్జు లేక రుంజు ౪ కాడిమేడి.

## ౧ కండె బిళ్లాట.

ఈ యాట నాడుటకు సుమారు ౬ గురు మొదలు ౧౬ గురు వరకు కావలయును. ఆటనాడువారందఱును సమ సంఖ్యగల రెండుపక్షములుగ చీలుదురు. ఒకచోట నొక చిన్న గుంటను త్రవ్వెదరు. ఈ రెండుపక్షముల వారిలో నొకరు 'కర్ర' 'బిళ్ల' తీసికొందురు. ఇతరపక్షము వారు బిళ్లను పట్టుకొని వేయుటకు 'కాచు' కొందురు. అందుకు 'రంగము' మీదికి వెళ్లుదురు. అంతట వీరిలో నొకడు బిళ్లను గుంటమీద నడ్డముగనుంచి యాకర్రతో 'చిమ్మును'. తరువాత తనకర్రను గుంటకు కొంచెము దూరముగ నడ్డముగ పెట్టి యూరకుండును. ఇట్లు చిమ్మినపుడు ప్రతిపక్షవారు బిళ్లను పైనుండగనే పుచ్చుకొన్నయెడల ఆట ఆడినవాడు "అయిపోవు"ను. వారు పట్టుకొనలేక పోయినయెడల వాళ్లలో మంచివాడొకడు దానిని కఱ్ఱకు లక్ష్యముచేసి బిళ్లతో దానిం గొట్ట ప్రయత్నించును. అట్లు అది కర్రకు తగిలినయెడల ఆటవాడయిపోవును. ఇట్లు తగులనియెడల వాడు "గూటు" కొట్టును. ఈ గూటు రెండు విధములుగ గొట్టుదురు. కొంతమంది కర్ర ముందరికి పొడుచుకు వచ్చునట్లు, గుప్పెదలో పెట్టి యా ముందుకువచ్చు భాగముమీద బిళ్ల నుంచి, బిళ్ల నెగురవేసి కర్ర అడుగు భాగముతో కొట్ట ప్రయత్నింతురు. కొందరు బిళ్లను ఎడమచేతి గుప్పెద నిలువుగ బెట్టి దానిపై బిళ్లనుంచి

దానిని ఎగురవేసి కుడిచేతిలో నున్న కర్రతో గొట్ట బ్రయత్నింతురు. ఎప్పుడైనను ఆటగాడు కొట్టినబిళ్లను పైనుండగనే ప్రతిపక్షమువా రెవరైన పట్టుకొనినయెడల ఆటగాడు ఃఅయిపోవును! ఆటగాడు ఏదైన కొట్టబోవుచు లక్ష్యముతప్పి కొట్టలేక పోయినయెడల ఆటవాడయిపోవును. మరియు ఆటగాడు ఏదైన కొట్టిన తరువాత ప్రతి కక్షవారిలో బాగుగ వేయగలవాడు బిళ్లను గుంటవద్దకు వేయును. ఇట్లు వేయునపుడు ఆటగాడు "ఎదురుబిళ్ల"ను కొట్టుటకు ప్రయత్నించును. అట్లు కొట్టినదాని నిరుకక్షులవారును దాక బ్రయత్నింతురు. ఆటవారు తాకినయెడల వారు అచ్చటినుండియే ఆటకర్రతో కొలుతురు. ఇట్లు ఆటవాడు కొట్టలేక పోవుటచేగాని, వేయువాని గురిచేతనేగాని, బిళ్ల గుంటవద్దనే పడినయెడల అనగా గుంటకు బిళ్లకు కర్రపొడుగుకంటె తక్కువదూర మున్నయెడల, ఆటవాడయిపోవును. ఈ దూరమును కొందరుఃగుంట'చుట్టును ఎటు చూచినను గుంటనుండి కర్రయంత నిడివిగల సున్నను చుట్టియుంచి స్పష్టము చేసికొందురు. ఆ బిళ్ల వచ్చు ఆటవానికి కాలికి తగిలినయెడల అప్పుడుఃకాలి బిళ్ల'ని బిళ్లతో ౭ పర్యాయములు కొలిచి యీ దూరమును తీసివేసి బిళ్లను దగ్గరకు జరిపెదరు. అంతట కర్ర అంతదూరము లేనియెడల ఆటవాడయిపోవును. ప్రతి కక్షపువాడును బిళ్లవేయునపుడు ఆటవాడు ఎదురు బిళ్లను

కొట్టినయెడల దానిని ప్రతిపక్షమువాడు తాకినయెడల వారు బిళ్లను తాకిన స్థలమునుండియె తిరిగి వేయుదురు. చేతనయిన తిరిగి ఎదురు బిళ్లకొట్టవచ్చును. ఇట్లు ఎన్నిపర్యాయములైన కొట్టవచ్చును. ఇట్లు వాడెదురు బిళ్ల కొట్టలేనియెడల వాడు ఆబిళ్ల పడిన స్థలమునుండి కఱ్ఱతో కొలచును. కాళ్ల "కండె" "రెళ్ల" చింత "మూళ్ల" ముద్ద 'నాళ్ల' నజ్జీ 'అయిదవి' గిరిగిరి 'ఆరె?' అప్పుడు యేట 'పిల్ల' లేక 'పిల్లదు' అని యిట్లు ౭ కఱ్ఱలయిన తరువాత ఒక 'పిల్ల' యగును. తిరిగి ౧౦ పిల్లలయిన తరువాత ఒక బండయగును. 'అయిదవి' కొట్టునపుడు ప్రతికక్షివారు ఆటవారికంటె ముందు 'అయిదవి అంటీల్ ముంటీల్' అని బిళ్లపయిన యుండగనే తాకిన ఆటవాడయి పోవును. 'కండె'ను ఎడమచేతియొక్క రెండవ వ్రేలును మధ్యవ్రేలితో వెనుకకు లాగిపట్టి ఆ నిడివిలో బిళ్లనుంచి దాని నెగురవేసి కొట్టెదరు. 'రెళ్ల' ఎడమ చేతియొక్క రెండవ వ్రేలును, చివరవ్రేలును తప్ప తక్కిన వాటిని ముణిచి వాటిమీద బిళ్లపెట్టి యథాప్రకారముగా కొట్టెదరు. "మూళ్ల" రెండు విధములుగ గొట్టెదరు:— మూళ్ళు, బందరుమూళ్ల. మూళ్ల కుడిచేతి మణికట్టువద్ద కుందునట్లుగా కఱ్ఱను పట్టుకొని దానిమీదను చెయిమీదను బిళ్లనుంచి ఎగురవేసి గొట్టెదరు. బందరు మూళ్ల కఱ్ఱ చివర కుడిచేతితో పుచ్చుకొని, రెండవ చివర ఎడమ గుప్పెదలో

చూపించి చిమ్మించి మూళ్లకు వలెనె ఈ మాటు ఎడమ చేతిపైనను చిమ్మ మీదను పెట్టి ఎగుర వేసి కుడిచేతితో గొట్టెదరు. "నాల్గను" బిళ్ల ఎడమచేతిలోనుంచి ఎగురవేసి గొట్టెదరు. "అయిదవిని" బిళ్ల వెల్లకిల బెట్టిన కుడిచేయి గుప్పెదమీద బెట్టి ఎగుర వేసి కొట్టెదరు. "ఆర్వ"ని బిళ్ళ నెడమ చేతిలో నొక చివర పుచ్చుకొని రెండవ చివర కర్రతో కొట్టి దానిని తిరుగునట్లు చేసి కర్రతో దానిని బాగుగ కొట్టెదరు. ప్రతిపక్షవారు. 'ఆర? ౧౨ చక్రాలు' అని అందురు. ఇట్లు ఈ యాటను ఒకరితరువాత నొకరు ఆడుదురు. నియమిత కాలములో ఏ పక్షమువారిమీద నెక్కువ 'పిల్ల' లెక్కువో వారాయాట నోడిపోదురు.

## ౨ లాలాఘ.

ఈ యాటలో ఎప్పుడును 'చిమ్మ'చు లేక 'చిత్తు'చునే యుందురు. ప్రతిపక్షమువారు యథాప్రకారముగా 'కండె రెళ్లాట'లో వలె బిళ్లవేయుచుందురు. ఇందు ఎదురు బిళ్ల తాకి నక్కర లేదు. ఇందును బిళ్ల పట్టుకొన్నచో ఆటవా డయిపోవును. ఈ యాటలో బిళ్ళను రెండు చివరల చెక్కుదురు. బిళ్ళ క్రిందపడిన తరువాత ఎత్తుగనున్న "కోపు" అనగా చివరమీద దెబ్బకొట్టి అది పైకి లేచునట్లు చేయుదురు. ఇట్లు మూడుసార్లు కొట్టవచ్చును. అది అట్లు లేచునపుడు దానిని కర్ర విసరి ఆటవాడు కొట్టును. అది లేవకపోయిన నట్లే యుంచును. అంతట అక్కడనుంచి గుంటనద్ద కెంతదూర

ముందునో సుమారుగ చెప్పును. ౧౦ కఱ్ఱలైనయెడల ఒక 'లాలు' లేక 'లాల' అందురు. అయిదుకఱ్ఱలయిన యెడల 'అర్థ' అందురు. ఇట్లు ఆడుదురు. అట్లు చెప్పినది కొలుచునప్పుడు సరిగానుండక ఎక్కువయినయెడల వాని ఆటపోవును; తక్కువయినయెడల అట్లు పోదు. నియమితసంఖ్య లాలు ఎవరితర్ఫ కటు వారిమీద నెక్కింతురో వారాటను గెలుతురు.

### 3. రజ్జు లేక రుంజు

ఈయాటలో బిళ్లనుగుంటలోనుంచి, చివర ఒక దెబ్బచే దానిని కొంచెము పైకెగురగొట్టి అంతట దూరమునకు గొట్టును. ఇట్లు ప్రతియొక్కడును మూడు పర్యాయములు కొట్టును. అందరు కొట్టినతరువాత ఎవరిది అందరికన్న తక్కువయో నిర్ణయించెదరు. అప్పుడు వాడు దొంగయగును. తక్కిన వారందరును పండుదురు. అప్పుడు వారిలో ప్రతియొక్కడును వరుసగా వానిచే నాటపెట్టించుకొనును. వారిలో నొకడు బిళ్లను గుంటలో బెట్టి తిరిగి యథాప్రకారముగనే కొట్టును. అప్పుడు దొంగ దానిని వేయును. వాడు వేయునపుడు దానిని తిరిగి 'ఎదురుబిళ్ల' కొట్టును అంతట నాయెదురుబిళ్ల పడియున్న స్థలమునకేగి దానిని లేవగొట్టి కొట్ట ప్రయత్నించును. ఇట్లు దొంగవచ్చి వానిని తాకువరకును దానిని కొట్టుచునేయుండును. దొంగవచ్చి తాకిన తరువాత తిరిగి గుంటవద్దకేగి దానిని వేయుమనును. చేతనయిన తిరిగి ఎదురు బిళ్లకొట్టును. ఇట్లు చివరకు కఱ్ఱంతదూరము గుంటకు బిళ్లకు లేనంతవరకు ఆటవాడు కొట్టుచునేయుండును. వీని యాట

అయిన తరువాత మరియొకడు తిరిగి యిట్లే యాడును. ఇట్టు లందరును అయినతరువాత నొక ఆట పూర్తియగును.

౧౩. గోలీలు

ఈయాటను ౨ మొదలు ౫ గురువరకు ఆడవచ్చును. సమభూమిమీద రెండు చిన్నగుంటలను దీయుదురు. ప్రతి యాటవాడు నొక గోలీని దెచ్చుకొనును. ఆటగాండ్రలో నొక డు 'ఉజ్జీలు' (ఉజ్జీలు) పెట్టును. (అనగా తనగోలీని నొకగుంట గట్టున పెట్టును.) మిగిలినవారు తమ గోలీలను వరుసగా డీలు దురు. (అనగా తమకాయలను గుంటదగ్గర పెట్టిన కాయమీ దుగా వేతురు.) అటుతరువాత 'ఉజ్జీలు' పెట్టినవాడు 'ఒకటి' గుంటబడును. (ఈయాటలో నొకని 'గోలీ' గుంటబడగా పీడు గుంటబడెనందురు) లేక గుంటపడక కాయనుకొట్టును. గుంటబడక కాయనుకొట్టినచో '౫' ఒక్కసారిగా వచ్చును. తిరిగివాడు "౬" ఆ కాయనుకొట్టినచో రెండవ కాయవాడు తనకాయ నిష్టమువచ్చినచోట దీసికొనివెళ్లి పెట్టుకొనును. తరువాత తొమ్మిదివరకు గుంటనుపడవచ్చును; లేక నొక సారి గుంటబడి మరియొకపర్యాయము కాయను కొట్టియయి నను తొమ్మిది తెచ్చుకొనవచ్చును. అటుపిమ్మట ౧౦ కాయ నుకొట్టియే తెచ్చుకొనవలయును. ఇట్లు ఎవరు ముందర కా యనుకొట్టుదురో వారు పండుదురు. అంతట మిగిలినవా రం దరు తిరిగి మొదటనుండి యాడుదురు.

ఇట్లు దొంగను నిర్ణయించిన తరువాత వాడు పండి నవారందరకు వరుసగా 'దోకుల్లు' లేక 'దేకుళు' లేక

'దేకిడీలు' పెట్టును. వాడు దోకుళ్లు రెండువిధములుగా పెట్టవచ్చును. కొందరు 'చిటికె' తో పెట్టుదురు. మరి కొందరు 'మోచేతితో' పెట్టుదురు. (అనగా గోలీ నొకచోటపెట్టి చిటికితోగాని మోచేతితోగాని ముందుకు కొట్టుట) దొంగ గోలికాయతో రెండుగుంటలు పడవలయును. పడిన గుంటయందే కాయ తిరిగి పోనపాటున పడినయెడల నంతట ౧౬ గుంటలు పెట్టవలయును. దొంగ గుంటపడునప్పుడు పండినవాడు వరుసగా దొంగకాయను రెండుపర్యాయములు కొట్టినయెడల నంతట వాడికొక 'ఉజ్జి' వచ్చును. ఇది కాయగుంటకు జానెడు దూరమునకు తక్కువనున్నయెడల రాదు. ఈ 'ఉజ్జి'ని గుంటపడకమునుపు 'ముందుచెప్పి' కొట్టుకొందురు.

## డెబ్బకు గోలి.

ఈ యాట ముఖ్యముగ పందెములకుపయోగించును. ఇందునొకడు 'ఉజ్జీలు' పెట్టును. మరియొకడా కాయమీదుగా 'షీలు'ను, అనంతరమందు 'ఉజ్జీలు' పెట్టినవాడు దగ్గరనున్న గుంటపడును. చేతనయిన రెండవ గుంటకూడ పడ ప్రయత్నించును. ఇట్లు రెండు గుంటలు రెండవవాడు పడకమునుపే వీడే పడినయెడల, రెండవవాడు వీనికొక కాయను పందెముగా నోడును. అట్లు గానియెడల, తనగుంటపడి రెండవవాని కాయమీదుగ తనకాయను చేతితో విసరి వేయును. అది తగిలిన వీనికొక కాయవచ్చును. అట్లు కానియెడల రెండవవాడు గుంటపడి వీనికాయకు గురిపెట్టి

తనకాయను వేయును. అది దీనికి తగిలినయెడల నప్పుడు కాయ కొట్టినవానికొక కాయను నాడిచ్చును. తగులని యెడల తిరిగి యిద్దరు నాడెదరు. అప్పటికొక యాట పూర్తి యగును. నియమితకాలములో ఎవరికెక్కువ కాయలు వచ్చునో వాడు ఆటను గెలుచును.

ఈ యాటవలన మనకు గురి బాగుగ కుదురును.

## ౧౪ చర్.

చర్ర, ఉప్పుచర్ర, ఉప్పు బందరు ఉప్పుబట్టి, ఉప్పుబలి మొదలగు నామములచేగూడ నీయాట పిలువబడును.

దీనినాడుటకు 10 మొదలు 20 వరకు మనుష్యులు సరిసంఖ్యలో నుండవలెను. వారు రెండు కక్షులుగ చీలుదురు. ఒక చదరపు భూమిపై నొక సమకోణ చతుర్భుజమును ▭ గీయుదురు. దీనిని నిలువుగ నొకగీతచే రెండుగ విభజింతురు. అంతట నడ్డముగ మూడు గదులు మొదలు 8 వరకు వచ్చునట్లు గీతలుగీయుదురు.

శత్రుపక్షమువారు నిలచు స్థలము.

4 గజ 4 గజ

౩ గజ ౩ గజ ౩ గజ

4 గజ 4 గజ

౩ ౩ ౩

4 4

౩ ౩ ౩

4 4

ఉప్పు

(పటమును చూడుము). అడ్డ గీతలమీద నొక పక్షపు వారిలో ఒక్కొకడు నొకదానిమీద నిలిచి రెండవ పక్షపు వారిని లోపలికి రానీయకుండ గీతపై కాయుచుండును. మధ్య నిలువుగీతమీద పెద్ద యుప్పు నిలుచును. ఇతడు నన్ని వైపుల కాచుచుండును. రెండవ పక్షపువారు రాకుండ మిగిలినవారుగూడ అట్లే కాచుచుందురు. చేతులతో మాత్రమే యితర పక్షపువారిని తాకవలెను. అప్పుడు రెండవ పక్షమువారు తాకబడక తప్పించుకొని గీతులనుదాటి యచ్చటనున్న 'ఉప్పు' తీసికొనివచ్చి అన్నిగదులలోను 'కలిపి' మరల బయలుదేరిన చోటికి వత్తురు. (పటమును చూడుము) అట్లు జేసినచో వారాయాటను "గెలుతురు" వీరిలో నెవరు తాకబడినను ఆయాట పోయి వారు గీతలపై కాయవలసి వచ్చును. నియమిత కాలములో ఎవరెక్కువసార్లు ఉప్పుతీసికొను వత్తురో వారు ఆటను గెలుతురు.

ఈ యాటవలన నతి జాగ్రతయు శరీర లాఘవమును నేర్పును ముఖ్యముగా కలుగును. ఇందు దేహపరిశ్రమ సయితము బాగుగ కలుగును. ఆటస్థలములేక "రంగము" యొక్క కొలతలు పటమునందు గననగును.

శత్రు పక్షమువారు ఉప్పు తీసికొనివచ్చుతరి మొదటి గదిలో నుప్పుకంపిన; నాగది దగ్గరనున్న రాజభటుడు శత్రు భటుని నేమియు చేయలేడు. అనగా, వెనుక గదివద్దనున్న

వాడు ముందుకు వచ్చువారిని తాకిన లాభములేదు. ఇట్లు జాగ్రతగా నుప్పు తెచ్చుచు వరుసగా నుప్పు ఒక గది తరువాత నొక గదిలో కలిపి అంత్యమందు శత్రుభటులు గమ్యస్థానము చేరవలెను. వదును రాజభటులను తప్పించుకొనుచు సీసరబల్లికి నొరకని పందరు నాట చేసికొనవలెను.

## బల్ చెడుగుడు, బల్, చెక్, డూడూ, లేక చెడుగుడు.

ఈయాట ఇద్దరు మొదలు 24-రు వరకు నాడవచ్చును. ఇరుపక్షులవారికి మధ్యనొక గీటుండవలెను. ఈ గీటుకొలత 12 మొదలు 16 గజములవరకు నుండవచ్చును. సరిహద్దులనగా మధ్య గీటువద్దనుండి ఇరుపక్షములవారికి 12 గజముల దూరము వ॥ నుండవలెను. ఈ సరిహద్దుల మధ్యస్థమైన భూమిలోమాత్రమాటనాడవలెను. పొరపాటుననైన హద్దుమీరిన యెడల నాయాటగా వయి పోవును.

ఇక నీయాటక్రమము, ఏదోనొక పక్షవారిలో నొకడు తన శత్రుపక్షమువారిపై దండెత్తునట్లు మధ్యరేఖ వద్దనుంచి కూతకూయుచు (బల్, చక్ చక్ అని) వందులో నొకరిని తాకవలెను. అట్లు తాకునపుడు కాలితో నెంతమాత్రము తాకరాదు. అట్లు తాకిన తాకినవాడే కూలిపోవును. తాకబడు పక్షవారందరు నొక్కుమ్మడి తమ శత్రువును బట్టుకొన ప్రయత్నించవలెను. శత్రువు తాకిపోవునపుడు మధ్యరేఖ

వద్దనాగి "అయినాడు" అని చెప్పి తనవైపు పోవలెను. అప్పుడు రెండవ కక్షిలో నొకడు పైతీరుననే చేయు బ్రయత్నించవలెను. ఈ యాట లాభములు:—గుక్క పెట్టువాని యూపిరి తిత్తులు బలపడి క్రమక్రమముగా ప్రాణాయామమందు నాస జనించును. అనేకమంది వీరులలో నొక్కవీరు డేకకాలమందు పోరు నేర్పు దానికి తగిన ధైర్యము, శౌర్యము, నిర్భీతి, ఉత్సాహము, పట్టుదల, మొదలగు పురుషగుణము లలవడును. ఎదురు కక్షివారికికూడ నైకమత్యము, పట్టుదల, ధైర్యాదిగుణము లలవడు మరియొక రహస్యముకూడ కలదు. ఆటగాండ్రలో నొక్కరు, ఒకసారి శత్రువులపైకి పోవలెను. పందెపు యాటలాడునపుడు ఇరుకక్షులవారికి వేరువేరు రంగుల చిహ్నము లుండవలెను. ఒకకక్షిలో అందరునై పోయి ఒక్కడు మాత్రమున్న యెడల, నాతడు శత్రువులపైకి పోయినపుడు కూతలేకనే పోవలెను. రెండు నిమిషములవరకు నట్లుండి తరువాత జాగ్రతగా తనవైపుకు శత్రులకు దారిలో చిక్కక పారిపోవలెను. అప్పుడు శత్రులలో నొకడు వచ్చుతరి తాను పట్టుకొనగా తనవైపువారందరు వచ్చి తనకు సహాయము చేయవచ్చును. ఇదేమాదిరి రెండవవారుకూడా చేయవచ్చును. ఇందులో ద్వంద యుద్ధముయొక్క రహస్యములు పూర్తిగా నున్నవి. ముఖాముఖీ పోరుట పురుషులకు ధర్మము. కాన స్త్రీ పురుషులందరు మనదేశములో పూర్వ

మనగా (శ్రీకృష్ణ దేవరాయలకాలములో) నీయాట నాడినట్లు నిదర్శనములు గలవు.

## మొగలి పఠాణి

దీనిని గంజీఫాయనికూడ పిలుతురు. ఇందుకు ఇంటనే నామములోగాని, మరిదేనిలోనైనగాని పటమున జూపినట్లుగా గీటుల గీయుదురు. ఒకప్పుడైనా మదిమొక్కపు డేడు గీట్లు గీయుదురు. అయిదయినపుడు పదునారును ఏడయినపుడు, ఇరువదియును కాయలుండును. పటములో జూపినమాదిరిగ, ఒక పక్షమున మొగలాయీలు ఒక రంగుగల కాయలును రెండవ పక్షమున మరియొక రంగుగల కాయలు పఠాణీలును పెట్టబడును. ఏడు గీట్లయినపుడు మధ్య రెండుపఙ్క్తులు దిగబడును. స్థలములు నడకయు ఇచ్చుట అంతయు పులిజూదములోవలెనే. ఈయాట పులిజూదమునకును చదరంగమునకును మధ్యస్థము.



ఒక కక్షివాని యొక కాయ మధ్యగీటుమీదికి జరుగగా నాట మొదలిడును. పులిజూదములో పులి ఒక మేకనుమా

త్రమే చంపగలదు. ఇంక మొగలాయిగాని పఠాణీగాని వరుసలో చంపదగినస్థితిలో నున్నకాయలు గల అన్నికాయలును చంపును. పులిజూదములోను, చదరంగములోను చంపతగని కాయలు, పులులు, రాజులుగ ఆట నట్టించబడును. ఇచ్చట రెండు పక్షములు నాశనముగ నరకుచు ఆట జరుగుచునే యుండును.


Andhrapatrika Press, – Madras